# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| అపవిమర్శలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | ... | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | ... | 1 | 0 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక | ... | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిది | ... | 0 | 12 |

శ్రీ ర స్తు.

# ఆంధ్ర భాషా భూషణము

శ్రీమదభినవదండిబిరుదాఢ్య

మూలఘటిక కేతనకవి ప్రణీతము.





చెన్నపురి

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

కాపీరైట్.] 1949 [వెల. అ. 6

# పీఠిక.

ఆంధ్రభాషాభూషణము పద్యరూపమగు తెనుఁగువ్యాకరణము. సుప్రసిద్ధుఁడగు కేతనకవి రచించినది. తిక్కనసోమయాజి కుభయకవిమిత్త్రుఁడని ప్రసిద్ధి యున్నట్లే కేతనకవికిఁ గవిమిత్త్రుఁడని ప్రసిద్ధి గలదు. ఆకాలమున నిదియొక బిరుదము వంటిది. సంస్కృతమున దండి గద్యకావ్యముగా రచించిన దశకుమారచరిత్రమును మన కవిమిత్త్రుఁడు తెనుఁగునఁ బద్యకావ్యముగా రచించి యుభయకవిమిత్త్రుఁడును భారతకవిముఖ్యుఁడు నగు తిక్కన సోమయాజికిఁ గృతియిచ్చి యాతని మెప్పువడసిన ప్రౌఢకవి. దాననే కేతనకవికి నభినవదండి యను బిరుదము గలిగినది. ఈతఁడు సకల కళానిపుణుఁడు, శుభచరిత్త్రుఁడు, శివభక్తుఁడు, సత్కవి. ఈవిషయము లాంధ్రభాషాభూషణమందలి పద్యములలోఁ గలవు.

క. "వివిధకళానిపుణుఁడ నభి
నవదండి యనంగ బుధజనంబులచేతన్
భువిఁ బేరు గొనినవాఁడను
గవిజనమిత్త్రుండ మూలఘటికాన్వయుఁడన్. 2

క. ఖ్యాతశుభచరిత్రుఁడ వృష
కేతనపాదద్వయానికేతనుఁ డనఁగాఁ
కేతన సత్కవి యనఁగా
భూతలమున [1]నుతిశతంబుఁ బొందినవాఁడన్. 3

ఆ. కవితఁ జెప్పి యుభయకవి మిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరఁగ దశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రౌఢ నన్ను వేఱె పొగడనేల?" 15

కేతనకవి మూలఘటికాన్వయుఁడు అనఁగా ఈతని యింటిపేరు మూలఘటికవారు. అహోబలపండితీయమును గాళిందీకన్యాపరిణయమును రచించిన గాలి నరసయ్య, గాలి అనుదానికి ప్రభంజనము అనియు నరసయ్య, అనుదానికి అహోబలపతి యనియు సంస్కృతీకరించి, ప్రభంజనము అహోబలపండితుఁడని పేరు పెట్టుకొనియుండెను. అట్లే మూలఘటికానామమునకు మొదటి తెలుఁగుపద మేదో యుండియుండును. లేక వీరఘంటలవారివలె మూలఘంటలవా రుండిరో. ఈతనితండ్రి పేరు మ్రానయ్య తల్లిపేరు అంకమాంబ. ఈతనితండ్రి పేరు మారయ్య యనియుఁ దల్లిపేరు సంకమాంబ యనియుఁ గొంద ఱభిప్రాయపడిరి. వార లట్లభిప్రాయపడుటకుఁ గారణము లేకపోలేదు. ఆంధ్రభాషాభూషణము

1. నతిశయంబు.

నందే 189 పద్యమున "మానేఁడు జేనేఁడు నను క్రియ, మానకేఁడులనొందుమీఁ దమ్రానయకేతా" అనియున్నచోట "మార్నకేతా" అని చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమందున్న వ్రాఁతప్రతిలోను, "మారయకేతా" యని యాంధ్రసాహిత్య పరిషద్భాండాగారమందున్న (1859 పుస్తకసంఖ్య గల). తాళపత్రగ్రంథమునను గలదు. ఒకప్రతిలో "మ్రానయకేతా" యనుటకు "మహిలో దండీ" యని గలదు.

అవి యటుండఁ దశకుమారచరిత్రమందుఁ బీఠికలో 23 పద్యమున "మహాలఘుటికాన్వవాయ సముద్రపూర్ణహిమమయూఖుండు మారయకమలకమల, వదనయగు సంకమాంబకు వరతనూజుఁ, గేతనార్యుని నన్ను విఖ్యాతయశుని" అని గలదు. ఇట్లు మారయ్యయను వ్రాఁతలనుబట్టి వార ట్లభిప్రాయపడి యుందురు. కాని మ్రానయ్య యనియే యనవలయును. కేతనకవిరచించిన విజ్ఞానేశ్వరమునం దీక్రింది పద్యమున మ్రానయ యని నకారము ప్రాపస్థానమునఁ బ్రయోగింపఁబడినది. దాన మ్రానయయని ధ్రువపడినది.

క. "మ్రానయకు సంకమాంబకు
సూనుఁడ మితసత్యహితవచోవిభుఁడను వి

జ్ఞానారూఢమనస్కుండ
నానాశాస్త్రజ్ఞుండను వినయభూషణుండన్." ౯

1925 సం. మున వావిళ్లవారు ప్రకటించిన దశకుమారచరిత్రమునకు మొదటఁజేర్చిన తొలి పలుకునఁ గేతనకవినిగుఱించి వ్రాయుచు నక్షత్ర చిహ్నముంచి పుటకుఁ గ్రింది భాగమున గీఁత క్రింద "ఈ కేతన కాదంబరి పద్యకావ్యము చేసెనని కొందఱందురు. ప్రబంధరత్నాకరమున కాదంబరి రచించినది మూనయ కేతన యని గలదు గాన నతఁడింకొకఁడు" అని తొలిపలుకు వ్రాసినవారు వ్రాసిరి. దశకుమారచరిత్రాదులు రచించిన కేతన మారయ కేతన యని భ్రాంతిపడుటచేత వారట్లు వ్రాసియుందురు. మూనయ కేతన యన మన యభినవదండియే. వారు వ్రాసిన కారణమునుబట్టి వారి యుద్దేశమునకు వ్యతిరేకముగాఁ గాదంబరి యభినవదండి బిరుదాంకితుఁడగు కేతన రచించినట్లే ధ్రువపడుచున్నది. రంగరాట్ఛందంబునందుఁ గేతన కాదంబరిలోనివని కొన్ని పద్యము లుదాహరింపఁబడినవి. వానిలో నొకపద్యముక్రింద భాస్కరుని కేతన యని యుండుటచేత ఆకేతన యితరుఁడేమోయని యూహింపవలసి యున్నది. కాని

వ్రాయ కేతన యనుటచే నాతఁ డింకొకఁడనుట యుక్తముగాదు.

కేతనకవి తల్లిపేరు సంకమాంబయో, అంకమాంబయో ధ్రువపఱచు ప్రయోగము గనఁబడ లేదు కాని, "మారయకు, సంకమాంబకు" అని యనేకస్థలములలో నుండుటచేత అంకమాంబ యంటిని. అకారసకారములకుఁ దాళపత్రగ్రంథములలో భేదము గనిపట్టుట గష్టము. అంకాలమ్మ, అక్కమ్మ యనుపేళ్లు ప్రాయికముగాఁ గలవు. మహాంకాళమ్మ, అంకాళమ్మ, అంకాలమ్మ, అంకమ్మ అను రూపములు మహాకాళమ్మ శబ్దమున కపభ్రంశము లయి యుండును. సంకమ్మ యనుపేరు శ్రుతచరము గాదు. తాళపత్రగ్రంథముల వ్రాఁతనుబట్టియును అంకమాంబ యనుటయే యుచితమని తోఁచినది.

దశకుమారచరిత్రము గృతినందిన తిక్కన సోమయాజితోపాటు తత్కృతికర్తయగు కేతన పదుమూఁడవశతాబ్దికి నడుమనున్న వాఁడనుట నిర్వివాదము. ఆంధ్రభాషాభూషణ గ్రంథాంతమందు "ఇది శ్రీమదభినవదండివిరచితంబైన యాంధ్రభాషాభూషణంబునందు సర్వంబు నేకాశ్వాస"మని కొన్ని ప్రతులలోఁ గలదు. ఆంధ్రసాహిత్యపరిషద్భాండాగారమందు 552వ సంఖ్యగఁ దాళపత్రగ్రంథమున

"శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజివరప్రసాదకవితాదివిలాసవేదశాస్త్రపురాణేతిహాసకళావినోదమానస... ఖ్యాత కేతనామాత్యప్రణీతంబైన యాంధ్రభాషాభూషణం బనుశబ్దశాస్త్రంబునందు నేకాశ్వాసము" అని కలదు. దీనినిబట్టి కేతనకవికిఁ దిక్కనసోమయాజి కవితాగురువని తేలుచున్నది. కేతన తిక్కనసోమయాజికంటెఁ జిన్నవాఁడని యూహింపవచ్చును.

కేతనకవి, దశకుమారచరిత్రము, విజ్ఞానేశ్వరము (ఇది యాజ్ఞవల్క్యస్మృతికిఁ దెలుఁగు. ఇదు యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యయగు విజ్ఞానేశ్వరీయము లోని విశేషవిషయములుగూడ నాధీకరింపఁబడినవి. కావుననే యా నామకరణము చేయఁబడియుండును) ఆంధ్రభాషాభూషణమును రచించెను. కాదంబరి పద్యకావ్య మాతఁడు రచించినదగునో కాదో సందేహము. ఇతరోదాహృత పద్యములనుబట్టి యూహించిన యూహా లేగాని గ్రంథ మింతవఱకు లభింపలేదు. వానిలోఁ బ్రకృతమగు నాంధ్రభాషాభూషణము తెనుఁగువ్యాకరణములలో మొట్టమొదటిదని ఈ క్రింద నుదాహరించిన యాంధ్రభాషాభూషణపద్యములు తెలుపుచున్నవి.

క. "మున్ను తెనుఁగునకు లక్షో
మెన్నఁడు నెవ్వరును జెప్పరేఁ జెప్పెద వి

ద్వన్నికరము మదిమెచ్చఁగ
నన్నయభట్టాదికవిజనంబులకరుణన్. 6

తే. సంస్కృతప్రాకృతాదిలక్షణముఁ జెప్పి
తెనుఁగునకు లక్షణముఁ జెప్పకునికియెల్లఁ
గవిజనంబుల నేరమిగాదు నన్ను
ధన్యుఁ గావింపఁదలఁచిన తలఁపుగాని." 7

ఈతఁడు వ్యాకరణము క్రొత్త రచింపబూనుటయా యని యధిక్షేపించుచు మూతివిఱుచుకొన్న వారు కొంద ఱాతనికాలమున నుండిరి. కావుననే యట్టి వారి కాతఁ డొకమ్రొక్కు మ్రొక్కినాఁడు.

ఉ. "క్రొత్తగ నాంధ్రభాషకును గొండొకలక్షణ మిట్లుచెప్పె నే
యుత్తమబుద్ధి వీఁడయని యోరలువోవక విన్న మేలు మీ
రొత్తిన మీకుమాఱు కొని యుత్తరమిచ్చుట చాలవ్రేఁగుమీ
చిత్తమునందు నన్నెరవు సేయకుఁడీ కవులార మ్రొక్కెదన్."

ఇందు "నన్నురవ సేయకుఁడీ" అనిపాఠాంతరము గలదు. పైపద్యములలో మున్నెవ్వరును తెనుఁగునకు లక్షణము చెప్పలేదనియుఁ, గ్రొత్తగ లక్షణము చెప్పుచున్నాననియుఁ గంఠోక్తిగాఁ గేతనకవి చెప్పెను. ఇట్లున్నను "నన్నయభట్టాదికవిజనంబులకరుణన్" అనుటచేత నన్నయభట్టు రచించినఁ దనఁబడు నాంధ్రశబ్దచింతామణి చూచి దాని ననుసరించియే కేతన

వ్యాకరణము రచించినట్లు సూచింపఁబడుచున్నదని కొంద అందురు. అది సుసంగతము కాదు. ఏలయన? "నన్నయభట్టాది కవిజనంబులకరుణాన్" అనుటవలన ఆంధ్రభాషాభూషణ మనులక్షణగ్రంథము రచించుటకు నన్నయభట్టాదికవుల భారతాదిగ్రంథములు లక్ష్యములుగాఁ గేతన గ్రహించెనని గ్రహింపఁదగును. కేవలము నన్నయభట్టకృతమనఁబడు వ్యాకరణమని గ్రహించినచో నన్నయభట్టాది కవిజనంబులనుచోట ఆదిశబ్దకవిశబ్దములు వ్యర్థము లగును. అది కవ్యుద్దేశమునకు వ్యతిరేకమనక తప్పదు. వ్యాకరణమునే కవి యుద్దేశించినచో స్పష్టముగా నేల చెప్పఁడు. పై పెచ్చు వ్యాకరణమెన్నఁడు నెవ్వరుఁ జెప్పలేదని కంఠోక్తిగాఁ జెప్పనా?

ఆంధ్రశబ్దచింతామణి సంస్కృతభాషలో రచింపఁబడియుండుటచేత దానిని స్మరింపలేదనియుఁ, దెనుఁగున నెవ్వరును రచింపకపోవుటచేత నెవ్వరును వ్యాకరణము రచింపలేదని చెప్పెననియుఁ గొంద అందురు. పద్యములలో వ్యాకరణము రచించుటకే మొదటివాఁడని మరికొంద అందురు. అది యాపాత మధురము. కేతనకు నన్నయభట్టునం దాదరము గలదని "నన్నయభట్టాది కవిజనంబులకరుణాన్" అను దానివలనఁ దెల్లమగుచున్నదిగదా. నన్నయభట్టునం దంతగౌరవమున్నపుఁ డాతనివ్యాకరణమున్న

చో, దానిని బ్రశంసించి యది సంస్కృతమున నుండుటచే సర్వజన సుబోధముగాదని తాను తెనుఁగున వ్యాకరణము రచింపఁబూనినట్లు చెప్పుట కవిజనసహజము గదా. నన్నయభట్టవ్యాకరణము నెఱిఁగియు నెఱుఁగనట్లు నటించుటకుఁ గేతనకవి కేమి యావశ్యకత గలదు? నన్నయభట్టవ్యాకరణమునం దనాదరమో, యసూయయో గలిగియుండునని యూహించినయెడల, నన్నయభట్ట వ్యాకరణము సంస్కృతమున నుండుటచే నాంధ్రజనోపయోగశూన్యమనియో, లోపభూయిష్ఠమనియో, లక్ష్యరహితమనియో యేదియో యొకదోష మెంచి దానిని నిరసించి తనగ్రంథమునకుఁ బ్రాశస్త్యము ప్రకటించుకొనుట సహజము. తాని చిన్నవ్యాకరణము రచించినంతమాత్రముననే వ్యాకరణరచనలోఁ గుమారపాణినులతో సరియగువాఁడని జను లెంచవలయు నన్నంత స్వప్రాశస్త్యాభిలాషిగదా కేతనకవి. ఈవిషయ మీక్రిందిపద్యమునఁ దానే స్పష్టముగాఁ దెలిపియుండెను.

క. "భాషావేదులు నను విని
యాషణ్ముఖపాణినులకు నగు నెనయని సం
తోషింప నాంధ్రభాషా
భూషణమను శబ్దశాస్త్రముఁ రచియింతున్." 8

మరికొందఱు చింతామణియందుఁ దత్సమ పదవిషయవ్యాకరణ మెక్కువగలదనియుఁ, గేతన గ్రంథమునఁ దత్సమేతరపదవిషయవ్యాకరణ మెక్కువగలదనియు, ఆకారణముననే తెనుఁగుభాగమునకు మున్నెవ్వరును వ్యాకరణము చెప్పలేదని కేతన యనెననియుఁ గొన్నికల్పనలు కల్పింతురు. అవి విమర్శసహములు గావు. కొంచెము తారతమ్యమున్నను రెండుగ్రంథములు రెండువిషయములను స్పృశించియే యున్నవి. కొన్నివిషయములలో వేఱువేఱుమార్గముల వ్యాకృతి గావించినవి. అంతమాత్రమునఁ గంఠోక్తిగాఁ జెప్పినవిషయము కొట్టివేయ వీలులేదు. కావున నన్నయభట్టాది కవిజనులగ్రంథములు ప్రమాణములుగాఁ గేతన గ్రహించెననుట యుక్తము.

ఇంతకును ఆంధ్రశబ్దచింతామణి యను పేరుగలిగి సంస్కృతభాషలోనున్న తెనుఁగు వ్యాకరణము నన్నయభట్టకృతమగునా? కాదా ? యనునంశము వివాదగ్రస్తము. నన్నయభట్టకృతమనుట కనేక విప్రతిపత్తులు లేకపోలేదు. దానినిగుఱించి వ్రాయఁబూనినచో నొకపెద్దగ్రంథ మగును. అప్పటికిని ఇదమిత్థమనితేల్పఁ గొన్నిచోట్ల నవకాశము గల విషయము గాదు. మొట్టమొదటి పాఠములుగల

గ్రంథము లభింపక కల్పితపాఠసహితములు లభిం చుటచేతఁ బ్రాచీనగ్రంథముల కీపాట్లు గలిగినవి.

ఒకవేళఁ జింతామణి నన్నయభట్టకృతమని సిద్ధాంత మొప్పుకొన్నను ఆగ్రంథము కేతనదృష్టికి గోచరమయినదన నవకాశము లేదు. కేతనకవి యాంధ్రశబ్దచింతామణి చూచియున్నచో దాని ప్రశంస చేసియుండునుగదా. అంతేకాక "ఆంధ్ర భాషాభూషణ మనుశబ్దశాస్త్రమున్ రచియింతున్" అని పెద్దప్రతిజ్ఞ చేసిన కేతన చింతామణిలోని విషయ ములును వ్యాకరణరచనాపద్ధతియును గ్రహించి యుండును లేదా దానికంటెను శాస్త్రప్రక్రియాను కూలముగాఁ దాను వ్యాకరణము రచించియుం డును. విమర్శించినచోఁ గేతనగ్రంథముకంటెఁ జింతామణి వ్యాకరణసంప్రదాయానుసారముగా నున్నది. ప్రక్రియావిషయమునఁ జింతామణియే సయుక్తికముగను, శాస్త్రీయముగను నున్నది. కేతనకవికిది మొట్టమొదటిప్రయత్న మనుటకు నిది యుఁ దోడ్పడుచున్నది. అది కేతన చూచియున్న చో నాంధ్రభాషాభూషణము నింతకంటె విపుల ముగను వ్యాకరణ సంప్రదాయయుక్తముగను జేసి యుండును. ఒకవేళ దానియం దనాదరము గలిగా నేని అందలివిషయములు ఖండించి, నిరసించి యుం డును. చింతామణిప్రక్రియకుఁ గేవలము వ్యతిరేక

ముగా నున్నస్థలములలోనయినఁ జింతామణిప్రక్రి యను ఆదరమున్నచో మతాంతరముగాను లేని చోఁ బ్రతికూలమతముగాను జూపుట వ్యాకరణ రచనాపద్ధతి. కేతన వ్యాకరణమున నట్టివిషయ మెక్కడను గనఁబడదు. ఆవిషయములు ప్రస పఱుప నొండు రెండుస్థలములు దిక్ప్రదర్శనముగా జూపెదను.

## పూర్ణబిందువు, ఖండబిందువు

రాముణ్డు, రాముండు, రాముఁడు అనురూప ములలో మొదటిది అనఁగా అనునాసికసహిత రూపముఁ గనఁబడుచున్నది. ఆధునికుల వ్రాతలలో నర్థబిందువు వ్రాయఁబడుచున్నది. శాసనముల లోను, తాళపత్రగ్రంథములలోను, గొన్నిచోట్ల హ్రస్వముమీఁద సానునాసికరూపముగాని సబిం దుకరూపముగాని వ్రాయఁబడియున్నను అర్ధబిందు సహితరూప మున్నచోట్లవలెఁ దేల్చి పలుకవల యును. లేనిచో ఛందోభంగము గలుగును. ఆవిష యము శాసనపాఠకులకును, తాళపత్రగ్రంథ ద్రష్టలకును, విమర్శకులకును దెలిసిన సుప్రసిద్ధవిష యమే గాన గ్రంథవిస్తరభీతిచేత నుదాహరణము లీయలేదు. దీర్ఘముమీఁది బిందువూఁది పలికినను, తేల్చిపలికినను గురుత్వమున సమానమే గాన ఛందో

భంగము లేదు. తేల్చి యర్ధబిందువున్నచోటఁ జదివినట్లు చదువవచ్చును. కాని పూర్ణబిందు పూర్వకప్రాసస్థానమున దీర్ఘముమీఁదబిందువు నూఁది పలుకవలయును. ఇది యాధునికకవుల గ్రంథములలో లేదు. కాని ప్రాచీనకవుల గ్రంథములలోఁ గేతనకాలపుఁగవుల గ్రంథములలోఁ గొన్నిచోట్లఁ గలవు. క్వాచిత్కమగుటచే రెండుస్థలములు చూపుచున్నాను.

ఉ. "పొంగున పారసత్వగుణ విస్ఫురణం బరమేశ్వరోరసా
మాంగమునందు........................
లొంగిన ..................నై
దాంగుననంతు.................................".

క. "పోంకనలి నీరజస్వల
సోంకిన దోషంబువాయ సూర్యుఁడు గవితా
శంక నపరాంబుధిలోఁ
గ్రుంకెనొకో యనంగఁ బ్రొద్దు గ్రుంకుడునంతన్."

నన్నెచోడుని కుమారసంభవము.

తర్వాత కవులుగూడ కొంద ఉపయోగించిరి. "కాంతకుమదిఁ బుట్టెడుతల పోంతలతో..." కాళిందీకన్యాపరిణయము. ఇట్టివి అరుదుగాఁ గలవు.

మొత్తముమీఁద సానునాసికరూపము అతి ప్రాచీనమనియుఁ, బూర్ణబిందుసహితము తర్వాతి దనియు, నది తేల్చి పలుకుటచే నర్ధబిందురూపము గలిగెననియు నిర్ధారణముచేయుట సయుక్తికము. కావున హ్రస్వముమీఁది పూర్ణబిందువు అర్ధబిందువగుననుట ప్రాచీనపుఫక్కిగాని, హ్రస్వముమీఁది యర్ధబిందువు పూర్ణబిందువగుననుట ప్రాచీనపుఫక్కిగాదు. ఈవిషయమున నాంధ్రభాషాభూషణాంధ్రశబ్దచింతామణులపద్ధతి యెట్లున్నదో పరిశీలింతము.

### ఆంధ్రభాషాభూషణము

క. "కుఱుచలతుది హల్లులకున్
బిఱుఁద న్నెలకొన్న యట్టిబిందువులెల్లన్
నెఱయఁగ నూఁదుచుఁ దేలుచు
నొఱపై యిరుదెఱఁగుఁ జెల్లుచుండుం గృతులన్." 56

క. "ననుఁగను నన్నుంగను దా
ఘనుఁడు ఘనుం డనఁగఁ జెల్లుఁ గవ్యనుమతిచేఁ
దనుబోఁటి లోభివాఁ డిటఁ
దన నిడుపులమీఁదిబిందు లరబిందులగున్." 57

క. "కుఱుచలపై యరబిందులు
నెఱయఁగ నూఁదినను జెల్లు నిడుపులమీఁదన్
నెఱయవు గద్యంబులలో
నెఱబిందువు లూఁదుఁ బద్యనికరములోనన్." 58

చివరపద్యమునం బాఠభేదములు గలవు. అవి చూపి నైరీతిని బాఠము సవరణచేయుటకుం గారణము దెలిపెదను. తాళపత్త్రగ్రంథముల నున్నరీతినే వ్రాయఁబడును.

I. క. "కురచలతుది యరబిందులు
నెరవులు నర్ధంబులతో
నెరిబిందువు పద్యగద్యనికరంబులకున్."

ఆంధ్రసాహిత్యపరిషద్భాండాగారమందున్న తాళపత్త్రగ్రంథము. దానిసంఖ్య 552.

II. క. "కురచలపై యరబిందులు
నెరయఁగ నూఁదినను జెల్లు నిడుపులమీఁదన్
నెరయవు పద్యంబులలో
నెఱబిందువులందు గద్యనికరంబులలో."

ఆంధ్ర సాహిత్య పరిషద్భాండాగారము నందలి తాళపత్త్రగ్రంథము. దానిసంఖ్య 1869.

క. "కుఱుచలపై యరబిందులు
నెఱయఁగ నూఁదినను జెల్లు నిడుపులమీఁదన్
నెఱయవు పద్యంబులలో
నెఱబిందువులందు గద్యనికరములోనన్."

1923 సం. ముద్రితము.

ఇట నెఱబిందువులంపు అనుచోట నెఱబిందువు లూఁదు అని పాఠాంతరము పుట క్రిందిభాగమునఁ జూపఁబడినది. ఇందు నిప్పుడులమీఁది బిందువులు గద్యములలో నూఁదుననియుఁ బద్యంబులలో నూఁదవనియుఁ గలదు. అది సంగతముగాదు. గద్యములలో నూఁదుట లేదు. పూర్ణబిందుపూర్వక ప్రాసమున్నచోటఁ బద్యములలోనే యూఁదుట గలదు. కావున "నెఱుపు గద్యంబులలో, నెఱ బిందువు లూఁదుఁ బద్యనికరములోనన్." అని సవరణ చేయఁబడినది.

హ్రస్వముల మీఁది బిందువులూఁదిన నూఁద వచ్చును. తేల్చిపలికినను తేల్చి పలుకవచ్చును. దీర్ఘముల మీఁదిబిందువు లరబిందువు లగును. అనఁగాఁ దేల్చి పలుకవలయును. హ్రస్వముల మీఁదిబిందువులు గద్యమునఁగూడ వచనరచనానుకూలముగా నూఁదిన నూఁదవచ్చును. గద్యములలో దీర్ఘముల మీఁదిబిందువు లూఁదవు. పద్యములలో నూఁద వచ్చును. అని పైదానితాత్పర్యము. కేతనవ్యాకరణమునఁ బూర్ణబిందు వర్ధబిందువగునని విధింపఁ బడినది.

ఇంకఁ జింతామణిపద్ధతి పరిశీలింతము. "సిద్ధసాధ్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః, హ్రస్వా

తూర్ణోఽపి భవేద్దీర్ఘా చ్చేత్ఖండ ఏవ స జ్ఞేయః”
“సున్న సిద్ధము, సాధ్యము అని ద్వివిధము. ఆబిందువే పూర్ణము, ఖండము అని రెండువిధములు గలది. హ్రస్వముకంటెఁ బరమయిన ఖండబిందువు పూర్ణబిందు వగును. దీర్ఘముకంటెఁ బరమయినది ఖండబిందువే యని తెలియఁ దగును.” అని పయిశ్లోకమునకు భావము. ఇందు హ్రస్వముమీఁది ఖండబిందువు పూర్ణబిందువగుననియు, దీర్ఘముమీఁదిది ఖండబిందువే యనియుఁ జెప్పఁబడినది. ఇందు అర్ధబిందువు పూర్ణబిందువగుట విధేయవిషయము. కేతనగ్రంథమున దీనికిఁ గేవలము వ్యతిరేకముగాఁ బూర్ణబిందు వర్ధబిందువగుట విధేయము. రెండును బరస్పరవిరుద్ధములు. రెండిటిలోఁ గేతన ప్రక్రియయే ప్రాచీనమతపోషకమును ప్రాచీనతరమును నగుట తేటదు. చింతామణిలోనిభావమును బ్రక్రియయుఁ గేతనకాలపుభావముకంటె నవీనమని చెప్పక తప్పదుగదా ? అది కేతన కాలమునకు నిన్నూఱుసంవత్సరముల క్రిందటనున్న నన్నయభట్టుకాలములోని భావమగుట కవకాశము గనఁబడదు.

కానిందు ప్రాచీనార్వాచీనతలమాట యటుండనిత్తము. మాటవరుసకుఁ జింతామణి కేతనకుఁ బూర్వమే రచితమయినదని యొప్పుకొన్నను కేతనయది చూచియుండఁడు. చూచియున్నచోఁ దా

నామతమునకు వ్యతిరేకముగా నేలచెప్పును? చెప్పి నపుడు చింతామణిమతము ఖండించి త్రోసివేయఁడా ? అది యొకమార్గమని యొప్పుకొన్నచోఁ బహ్వాంతరముగాఁ జెప్పఁడా? అట్లు చెప్పుట వ్యాకరణకర్తల సంప్రదాయము. మనకేతన పాణినీయ కౌమారవ్యాకరణాదులసంప్రదాయ మెఱిఁగినవాఁడేగదా. ఆంధ్రశబ్దచింతామణి కేతనకవి చూడనే చూడలేదనుట యుక్తము.

మరియొకవిషయము పరిశీలించి ముగించెదను.

క. "మల్లెయు లంజెయు గడ్డెయు
నొల్లెయు ననుపగిది పలుకులొప్పుగఁ గృతులన్
మల్లియ లంజియ గడ్డియ
యొల్లియ యని పలికిరేని యొప్పుంగృతులన్." 177

ఆంధ్రభాషాభూషణము.

ఎదంతరూపములకు ఇయాంతరూపము లుండవచ్చును అని కేతనభావము. చింతామణిలో "ఎదంత తాచనామ్నామియాంతానామ్" ఇయాంత రూపములకు ఎదంతరూపము గలుగవచ్చును అని గలదు. ఆంధ్రభాషాభూషణమున "ఎ" కి "ఇయ" చింతామణిలో "ఇయ" కు "ఎ" విధింపఁబడినది. రెండు నన్యోన్యప్రతికూలములు.

వ్యాకరణసంప్రదాయము ననుసరించి పరిశీలించినయెడల "లంజికా" "మల్లికా" అను సంస్కృత రూపములకు వరుసగా "లంజి ఆ" "మల్లి ఆ" అని ప్రాకృతరూపములు గలుగును. వానికిఁ దెనుఁగు సంప్రదాయమున "లంజియ" "మల్లియ" అనురూపములవతరించినవి. వానికి ఎదంతత్వ మంగీకరింప లంజె, మల్లె అనురూపములు సిద్ధించినవి. ఇది వైయాకరణ ప్రక్రియ. వానిసామ్యముననుసరించి మరి కొన్ని శబ్దము లాగణమునఁ జేరినవి. కేతన ప్రక్రియ కంటెఁ జింతామణి ప్రక్రియ ఈవిషయమున శాస్త్రసంప్రదాయానుసారము. అది కేతన చూచియున్నచో ఈ ప్రక్రియనే యనుసరించియుండును. అది యాతనికి నచ్చనిచో ఖండించి తనమతమునకుఁ బ్రాశస్త్యము స్థాపించియుండును. అది నన్నయభట్టమతమనిగాని నన్నయవ్యాకరణమనిగాని తెలిసినచో నెత్తిమీఁదఁ బెట్టుకొనును. ఇట్టివిషయము లెన్నియో గలవు. విమర్శకులు గ్రహింతురుగాక. చింతామణి చూచియున్నయెడలఁ గేతనకు నంత యతిసంక్షేపముగా వ్యాకరణమురచింపబుద్ధిపుట్టునా? కేతన వ్యాకరణమున మనము గ్రహింపఁదగినప్రాచీన సిద్ధాంతము లెన్నియో గలవు. మచ్చునకొకటి చూపెదను. ప్రథమమీఁది కచటతపలకు, గసడదవలు వచ్చుట వికల్పమనియు; తాను, నేను,

శబ్దములకుఁ బరమగువానికి రావనియు, సంస్కృత శబ్దముల లోనివానికి రావనియుఁ బ్రస్తుతవ్యాకరణము. ప్రాచీనశాసనములును వ్రాఁతప్రతులును పరిశీలించినయెడలఁ బ్రథమమీఁది కచటతపలకు గసడదవాదేశము నిత్యమనియును, సాంస్కృతికములకుఁగూడఁ గలుగుననియుఁ దేలును. ఈవిషయమునఁ గేతనభావము పరిశీలింపుఁడు.

"క. పొసఁగఁగఁ బల్కెడుచోఁ బొ
ల్పెసఁగిన ప్రథమాంతములపయిం గదిసి కడుక్
బసనగు క చ ట త ప ల మును
గ స డ ద వల్ బ్రోచిపుచ్చుఁ గవిజనమిత్రా. 62

తే. సుతుఁడు గడువేగమున వచ్చె సుతుఁడు సనియె
సుతుఁడు డక్కరితోడఁ దాఁ జుట్టమయ్యె
సుతుఁడు దండ్రికిఁ బ్రణమిల్లె సుతుఁడు వుట్టె
ననఁగ నివి యుదాహరణంబులయ్యెఁ గృతుల. 63

ఈవిషయమున నాంధ్రశబ్దచింతామణిలోనిశ్లోకమి ట్లున్నది.

"గసదడవాస్స్యుః ప్రథమామాత్రాదాత్తాస్స దోర్వినై వైతే, న వికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాం గసడదవాస్స్యుః"

త్తాను, నేను శబ్దములువక్క మిగిలినవానిలోని ప్రథమమీఁది కచటతపలను, గసడదవలు వచ్చును. వికృతిపదముమీఁది సంస్కృతపదములకు రావు అని కలదు. గసడదవాదేశము నిత్యమే కానికొన్ని యపవాదములు విధించెను. కేతనయిచ్చిన యుదాహరణములనుబట్టి సాంస్కృతికములకు రాదను నపవాదసూత్రము విధించియుండునా యని యూహించిన నూహింపవచ్చును.

ఆంధ్రభాషాభూషణ మెంత చిన్నపుస్తకమయినను విపులవ్యాకరణములు లేనికాలమున మహోపకారము చేయుటయేగాక తర్వాతి వ్యాకరణకర్తలకు మార్గదర్శక మయినది.

కేతన పద్యరూపమున వ్యాకరణము రచించునపుడు సంబుద్ధిరూపముననో, మరియొకవిధముననో తననామము తనబిరుదములు నందుఁజేర్చి శాశ్వతములు గావించుకొన్నాఁడు.

I. "అలవడి యీ క్రియలు చెల్లు నభినవదండీ." 139

II. "ఎలమి నీవు మీరు...నూత్నదండి చెప్పె" 106

III. "మానకెంౘులనొందు మీఁద ప్రాసయశేతా" 189

IV. "గసడదవల్ ప్రోచినిల్చుఁ గవిజనమిత్రా" 62

కేవల వ్యాకరణవిషయ మిందుఁ బ్రతిపాద్యాంశ

మయినను కేతనకు, సహజమయిన చక్కని కవితా శైలి గలదు. మచ్చునకుఁ గొన్ని పద్యము లుదాహరింతును.

I. క. "నేరములు కాళిదాస మ
యూరాదులకైనఁ గలుగ నొరులకు లేవే
సారమతు లైన సుకవుల
కారుణ్యము గలిమి నేర్పు కవిజనములకున్." 12

II. తే. "పెక్కు సంస్కృతశబ్దంబు లొక్కపదము
క్రిందఁ దద్విశేషణము లింపొందఁ గూర్చి
తెలుఁగు తత్సమాసము క్రిందఁ గలుపునప్పు
డగ్రపదముతో నిలనగు నర్థఘటన." 130

III. తే. "తనవిశిష్టకులాచారధర్మ మనఁగఁ
దనజగద్గీతసాధువర్తన మనంగఁ
దనదిగంతరవర్తిప్రతాప మనఁగ
నివి యుదాహరణంబులై యెందుఁ జెల్లు." 131

సంస్కృతాంధ్రాదిగ్రంథప్రకాశకులయిన మ-రా-శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారు ఆంధ్రభాషాభూషణము నాచేతికిచ్చి యొకమాఱు చదివి దీనికిఁ జిన్నపీఠిక వ్రాసియిమ్మని చెప్పఁగాఁ జిన్నపీఠిక వ్రాయ నెంచితినిగాని వ్రాయఁబూనినపు డనుకొన్నదాని కంటె మిగులఁ బెద్దది యయినది. తాళపత్రగ్రంథ

ములు చూచినఁగాని కొన్నివిషయములు నిర్ణయింప వీలులేకపోయినది. చెన్నపురిలో నున్న ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునను, కాకినాడలో నున్న యాంధ్రసాహిత్య పరిషద్భాండాగారమునను గల తాళపత్రగ్రంథములును కాకితపుఁబ్రతులును ముఖ్యమగువిషయములకై పరిశీలించితిని. పుస్తకమంతయును ఆప్రతులతో సరిచూడ నవకాశము గుదురలేదు. ఇదివఱకును ముద్రించిన ప్రతి వ్రాతప్రతులతో సరిచూచినదే గాన మరలఁజూచుట యావశ్యకము గాదనియుఁ దోఁచినది. ఆంధ్రగ్రంథప్రకాశకులగు వావిళ్లవారియెడ నాంధ్రలోక మెంతయో కృతజ్ఞత చూపఁదగును.

రామచంద్రపురము,
ఆంగీరసశయనైకాదశి.

ఇట్లు, భాషాసేవకుఁడు,
శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

శ్రీః

# ఆంధ్రభాషాభూషణము

---

శా. శ్రీవాణీగిరిజేశ దంతిముఖ రా
జీవాప్తులం గొల్చి వా
గ్దేవిం జిత్తములోన నిల్పుకొని శ
క్తిం భక్తిఁ గీర్తించి నా
నావిద్వ[1]త్సభలన్ వలం గొనువినూ
త్నప్రౌఢకావ్యక్రియా
ప్రావీణ్యంబున నుల్లసిల్లుకవులన్
బ్రార్థించి ధన్యుండ నై. 1

క. వివిధకళానిపుణుఁడ నభి
నవదండి యనంగ బుధజనంబులచేతన్
భువిఁ బేరుఁ గొనినవాఁడను
గవిజనమిత్రుండ మూలఘటికాన్వయుఁడన్. 2

క. ఖ్యాతశుభచరిత్రుఁడ వృష
కేతనపాదద్వయీనికేతనుఁ డనఁగా
గేతన సత్కవి యనఁగా
భూతలమున [2]నుతిశతంబుఁ బొందినవాఁడన్. 3

---

1 జ్ఞుల న్మదిందలచి. 2 నతిశయంబు

క. ప్రాసయతును నంకమకును
సూనుఁడ మిత సత్యనయవచో విభవుఁడవి
జ్ఞానానూన మనస్కుఁడ
నానాశాస్త్రజ్ఞుఁడను గుణాభిజ్ఞుండన్ 4

ఆ. కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరికి బ్రహ్మకైన నలఁడు మెచ్చఁ
బరఁగ దశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రౌఢ నన్ను వేఱె పొగడ నేల. 5

క. మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాదికవిజనంబులకరుణన్. 6

తే. సంస్కృతప్రాకృతాదిలక్షణముఁ జెప్పి
తెనుఁగునకు లక్షణముఁ జెప్ప కునికి యెల్లఁ
గవిజనంబుల నేరమి గాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచినతలఁపుగాని. 7

క. భాషావేదులు నను విని
యాషణ్ముఖపాణినులకు నగు నెన యని సం
తోషింప నాంధ్రభాషా
భూషణ మనుశబ్దశాస్త్రముఁ రచియింతున్ 7

క. ఒప్పులు గల్గిన మెచ్చుఁడు
తప్పులు గల్గిన నెఱింగి తగ దిద్దుఁడు త

ప్పొ ప్పనకుఁ దొప్పు తప్పని
చెప్పకుఁ డీ కవు లుపాస్తి చేసెద మిమ్మున్. 9

క. గుణదోషంబు లెఱిఁగి యిది
గుణమిది దోష మనిప్రాజ్ఞుఁ గొందురు సుకవుల్
గుణదోషము లెఱుఁగక దు
ర్గుణములె గుణములనిప్రాజ్ఞుఁ గొందురుకుకవుల్.

ఉ. క్రొత్తగ నాంధ్రభాషకు[1]ను
గొండొకలక్షణ మిట్లు [2]చెప్పనే
యుత్తమబుద్ధి [3]వీఁడ యని
యోరలు వోవక విన్న మేలు మీ
రొత్తిన మీఁకు మాఱుకొని
యుత్తర మిచ్చుట చాలప్రేఁగు మీ
చిత్తమునందు [4]న న్నెరవు
సేయకుఁడీ కవులార మ్రొక్కెదన్.

క. నేరములు కాళిదాసమ
యూరాదుల కైనఁ గలుగ నొరులకు లేవే
సారమతు లైనసుకవుల
కారుణ్యము కలిమి నేర్పు కవిజనములకున్. 12

తే. కంచి నెల్లూరు మఱి యోరుఁగ [5]ల్లయోధ్య
యనుపురంబులపై గంగ కరుగు మనిన

---

1 నొకొండొక. 2 చెప్పనే. 3 నీతఁ డని. 4 'నన్నెరవి' పాఠాంతరము. 5. 'ల్లవంతి' అని పాఠాంతరము గలదు.

పగిది నొకత్రోవఁ జూపెద బహుపథంబు
లాంధ్రభాషకుఁ గల వని యరసికొనుఁడు. 13

ఆ. తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును
దానివలనఁ గొంత గానఁబడియెఁ
గొంత తాన కలిగె నంతయు నేకమై
తెనుఁగుబాస నాఁగ వినుతి కెక్కె 14

క. తెలుఁగునఁ గల భేదంబులుఁ
వెలుఁగ్గె సంస్కృతముచెల్లు తెఱఁగులుఁదత్సం
ధులును విభక్తులు నన్యో [తున్.
యలఘుసమాసములుఁ గ్రియలు నవి యెఱిఁగిం

క. ఆదులు స్వరములు నచ్చులు
కాదు లొగి న్వ్యంజనములు హల్లులు ననఁగా
మేదిని నెల్లెడఁ జెల్లును
కాదుల నైదైదు కూర్పు నగువర్గంబుల్. 16

క. యరలవలును శషసహలును
నరయఁగ నంతస్థ లూష్మ లనఁగాఁ జెల్లున్
సరవి నివె వేళ్లు పెట్టుదుఁ
దిరముగఁ దల్లక్షణములు దెలిపెడిచోటన్. 17

క. [1]ఆఱు సమాసము లిరువది
యాఱంతము లాఱుసంధు లవ్యయములు పె
క్కాఱింటిసగము రీతులు
నాఱింటికి నొక్కఁ డెక్కు డౌను విభక్తుల్. 18

ఆ. తత్సమంబు నాఁగఁ దద్భవం బన నచ్చ
తెనుఁగు నాఁగ మఱియు దేశ్య మనఁగ
గ్రామ్యభాష నాఁగఁ గల వైదు తెలుఁగులు
వేఱ వేఱ వాని విస్తరింతు. 19

క. మును సంస్కృతపదములపైఁ
దెనుఁగువిభక్తులు ఘటించి తేటపడఁగఁ జె
ప్పిన నది తత్సమ మనఁ జను [గన్.
వనము ధనము పురుషుఁ డబల వసుమతి యనఁ

క. లచ్చి యన లక్ష్మిపే రగు
నచ్చం బన నచ్ఛమునకు నభిధానము వి
వ్వచ్చుఁడు బీభత్సుఁడు వి
దచ్చయ మనునిట్టి తెనుఁగు తద్భవ మయ్యెన్.

సీ. అర్ఘంబె యగ్గువ దీర్ఘిక డిగ్గియ
గుణములు గొనములు కులము కొలము

---

1 కొన్ని ప్రతులలో లేదు.

స్నిగ్ధంబు నిద్దంబు శ్రీ సిరి భంగంబు
బన్నంబు దిశ దెస భాష బాస
యతులు జన్నలు యముఁడు జముం డగు
నాజ్ఞప్తి యానతి యాజ్ఞ యాన
దృష్యాతంబు జూదంబు దోషంబు దోసంబు
ముగ్ధుండు ముగుదండు ముఖము మొగము

తే. వసనంబు ప్రసాదసం బసము యశము
నష్టంటయ చర్మ్యమష్టి కర్జంబు కార్య
మీరసం బీర్ష్య వేరంబు వైర మిట్టి
వగిది పల్కులు తద్భవపదము లయ్యె. 22

క. తల నెల వేసవి గుడి మడి
పులి చలి మడుఁ గూరు పేరు బూరుగుమగవాఁ
డలుక యని యెల్లవారికిఁ
[1]తెలిసెడియాపలుకు లచ్చతెనుఁగనఁబరఁగున్.

సీ. ఎలుకువ నెత్తమ్మి యెరగలి యొసకంబు
నొస లింతి తేఁటి వెక్కసము నెమ్మి
నక్కవ చెచ్చెర మచ్చిక పొచ్చెము
కడిమి యేత్తెటి లగ్గు కలవలంబు

1 తెలివిడిగంబలుక నచ్చ

వెన్ను విన్నదంబు పీనులు వెన్నడి
యెక్కలి తివురుట యుక్కు మేటి
బాగు తొయ్యలి బోటి ప్రన్నన సరి జోటి
వేనలి పొలపంబు విన్ను మన్ను
తే. నెల్లి కొఱలుట వీచోపు లుల్ల మువిద
పీఁక కాఱియ గ్రద్దలు వేఁట గ్రేణి
కౌను పాలిండు లోగి మొగి గనయ మిట్టి
తెలుఁగుపలుకులు [1]ధర దేశితెనుఁగు లయ్యె.

సీ. తెమ్మెర లెలమావి తెలిగన్ను క్రొన్నన
వలరాజు రేతేఁడు వాలుఁగంటి
యలరులపిండు తెక్కలికాఁడు క్రొమ్మించు
కెమ్మోవి కెంజాయ కమ్మతావి
కడలి తామరకంటి వెడవిల్తుఁ డెడకాఁడు
నలువ కలువకంటి నాన సెగ్గ
మెలనాఁగ ముద్దియ చెలువ చిగురుబోఁడి
తెఱవ తలిరుబోఁడి మెఱుఁగుబోఁడి
తే. పవరు విసువుట పరి గమి పసలు నసదు
పొద్దు రేయెండ తబ్బిబ్బు పోటు మట్టు

1 దేశ్యంపు.

తనివి వలవంత చెంత మంతన మనంగఁ
దేరనాడిన దేశ్యంపుఁదెనుఁగు లయ్యె. 25

సీ. పంచాకుమయ్యతో పించాకుమయ్య వా
టీదెచ్చుతారు మమ్మాదలంచి
యేగ గొంటూరమ్ము యేదాలు వోఢాలు
మోసేటివా రాసనేసువారు
వాడి విరాళితో బాడిగ వోకుమీ
యీడేకదా మమ్ము యినుతిసేసె
పంపేరు తెంపేరు పాడేరు సూసేరు
యిండాము కందాము పొందు మిస్తి

ఆ. అటుకు దప్పె వెగడు నషువ లె నిషువ లె
నాడ నీడ నేడ నచ్చు నిచ్చు
నోయ గాయ వేయ కుండాడు బామ్మఁడు
గద్ద గుద్ద నాఁగ గ్రామ్య మయ్యె. 26

ఆ. తత్సమంబు పక్కి తక్కిన నాలుగు
నచ్చు తెనుఁగు లందు నఖిలజనులు
నందులోన గ్రామ్య మనఁగ నెవ్వరు నొప్ప
రొరులఁ బెగడుచోట నొప్పు నదియు. 27

వ. అనంతరంబ సంస్కృతపదంబులు తెనుంగు
గావించు తెఱం గెఱింగించెద. 28

సీ. వృక్షేణ దత్తాయ పక్షిభిః పుత్త్రస్య
యనువిభక్తులు తెనుంగునకుఁ జొరవు
అస్తి ప్రయాతి గాయంతి భుంక్తే సంతి
నయతి స్మరతి యను క్రియలు సొరవు
గత్వా హసిత్వా ప్రకాశ్య సంత్యజ్య నాఁ
దనరు త్వాంతల్యబంతములు సొరవు
గంతుంపురీం రిపుంహంతుం సుఖంపాతు
మనుతుమున్నంతంబు లరయఁ జొరవు

తే. అపి చ తు హి వై న వా సను లనఁగఁ బెక్కు
లవ్యయంబులు చొరవెందు నాంధ్రకవితఁ
బెఱపదంబులతోడను బొరలినిల్చు
నవి తెనుంగులు గావింతు నభిమతముగ. 29

క. ఇల సంస్కృతపదములపై
నెలకొని నిల్చినవిసర్జనీయంబులు సు
న్నలు నిలువవు తెనుఁగులలో
నలవడఁగాఁ బల్కుచోట నభినవదండీ. 30

క. లలి నేకాక్షరపదములు
వెలిగాఁ దక్కినపదముల వెలసినతుదయ
చ్చుల[1]నిడుపు లుడుపఁ దెనుఁగగు
నిల నెప్పటియట్ల యుండు నేపుంతంబుల్. 31

---

1 ముద్దరాజు రామన రాఘవపాండవీయ వ్యాఖ్య.

క. స్త్రీయన ధీ యన శ్రీ యన
నీయేకాక్షరపదంబు లీక్రియఁ జను గౌ
రీ యన గౌరి యగుణ వా
ణీ యన వాణియగు మణి మణీ యనుచోటన్.

క. లక్షణములు దెలిపెడిచో
నక్షరములు దెలియుకొఱకు నను పైక్రియణ
శిక్షార్థముగాఁ బల్కెద
లాక్షణికులు తప్పుగాఁ దలంపకుఁడు మదిన్. 34

క. ప్వఱ్ఱగు నుఱ్ఱంతముపై
ముఱ్ఱగు నఱ్ఱంతశబ్దములపై రెంటణ
డుఱ్ఱగుఁ బురుషాఖ్యలపై
న ఱ్ఱు ఱ్ఱగు నట్టియెడల నభినవదండీ. 35

క. వానునకుణ వంతుండును
మానునకును మంతుఁడును గ్రమంబున నగు శ
బ్దానీకాంతనకారము
మానించి విభక్తు లెక్కుమఱియొక్కొకచోన్.

క. తపువు తనువు ధన మర్థము
గుణుఁడు పురుషుఁడుత్తముండుగుణవంతుఁడు సు
స్థిరమతిమంతుఁడు యశమున
నరుదుగ హనుమంతుఁ డన నుదాహరణంబుల్.

బూరితాత్మఁ డనఁగఁ బుణ్యకర్మఁ డనంగఁ
బుష్పధన్వఁ డనఁగఁ బోలుచు జగతి. 39

ఆ. గురువు ప్రభువు నాఁగ గురుఁడు ప్రభుం డన
శర్మ వర్మ నాఁగ శర్మఁ డనఁగ
వర్మఁ డనఁగఁ జెల్లు పటువును మనువును
బటువు దలకుఁ బాసి పరఁగుచుండు. 40

తే. ద్విట్పదమునకు ద్విషుఁ డగు విద్విషుండు
విత్పదమునకు విదుఁ డగు వేదవిదుఁడు
భుక్పదమునకు భుజుఁ డగు భూభుజుండు
దిక్పదమునకుఁ గుఱ్ఱఁగుఁ దెలియు దిక్కు. 41

క. తెలుఁగున సంస్కృతపదములు
పలికెడి తెలుఁ గెఱిఁగినంత ప్రత్యక్షముగాఁ
దెలిపితిఁ దెలుపనిపదములు [నన్.
గల వవి సంస్కృతముతోడఁ గలయుఁ దెనుఁగు

వ. అనంతరంబ సంధు లెఱింగించెద. 43

క. మొదలిపదము తుదివర్ణము
వదలక పైపదము మొదలివర్ణముతోడం
గదియఁగ సంధులు నాఁ దగు
విదితపుఁదత్సంధు లెల్ల వివరింతుఁ దగన్. 44

క. ఉత్వము క్రియల కినులపై
నిత్వము పెఱరూపు దాల్చు నీవే ననఁగా
సత్త్వముఁ గలిగెడి సూరి క
తిత్వరితము పొందు నాఁగఁ దెల్లం బగుచున్.

క. అచ్చుగ నఱ్ఱె ఱ్ఱూ ఱ్ఱలు
నచ్చులె యంతమునఁ దెనుఁగుటభిధానములన్
విచ్చలవిడిఁ బలుకులఁ బెఱ
యచ్చులు చనుదెంచుమానవాఖ్యలయందున్.

వ. తత్సంధిక్రమం బెట్టిదనిన.

తే. అవనినాథుఁడు దయఁ జూడ కనిపినాఁడు
రాజు దయలేక యున్నాఁడు రమణియొడను
అలరుబం తిది మేల్బంతి యది యనంగ
నెల్లకృతులను మిక్కిలి చెల్లుఁ గాన. 48

క. అచ్చుగఁ బెఱయచ్చుల పై
నచ్చు యకారంబుఁ దాల్చు నబలా యేలే
యిచ్చు యపూర్వమొకో యిది
యచ్చెరువై యునికి నా సుదాహరణంబుల్. 49

తే. ఒనర నుఱ్ఱంతషష్ఠిపై నున్నయచ్చు
మొదలఁ బొల్లునకారంబు గదిసి నిల్చు

కొడుకునా ల్గూఁతునొడమి నాఁ గూడుఁ గాని
కూఁతొడమి కొడుకా లనఁ గూడ దెందు. 50

క. అది యిట్టింతమువిూఁదక్
గదిసిన నాద్యచ్చుడుగు వికల్పముతోఁ గా
లిది కాలియది యనఁగఁ జే
తిది చేతియది యని పలుకఁ దెల్లం బగుచున్.

క. అచ్చుగఁ బై హ ల్లుండక
యచ్చుండినఁ దద్ద్వితీయ కంత్యనకారం
బచ్చోఁ బాయక నిల్చును
విచ్చలవిడిఁ బోవు నచ్చు వేఱొక పైనన్. 52

క. సుతు నడిగె సుతుని నడిగెను
సుతు ననిచె న్సుతుని ననిచె సుతునిం గెలిచెన్
సుతు గెలిచెఁ బోరిలో ను
ద్ధతుఁ డొకఁ డనవరుసతో నుదాహరణంబుల్.

క. నాంతం బైనపదంబుల
షాంతం బై నున్నశబ్దముల కచటతపల్
పొంతి గజడదబ లగు న
య్యంతనకార మగు నున్న యభినవదండీ. 54

ఆ. వానిఁ గనియెఁ జేరె వానిఁ డక్కరిఁ జేసె
వానిదానిఁ దెగడె వానిఁ బొడిచె

ననఁగ వరుస నివి యుదాహరణంబులు
నుతగుణాభిరామ నూత్నదండి. 55

క. కుఱుచలతుది హల్లులకుఁ
బిఱుఁద న్నిలకొన్నయట్టిబిందువు లెల్లన్
నెఱయఁగ నూఁదుచుఁ దేలుచు [న్.
నొఱపై యిరుదెఱఁగుఁ జెల్లుచుండుఁ గృతుల

క. ననుఁ గను నన్నుం గను దా
ఘనుఁడు ఘనుం డనఁగఁ జెల్లుఁ గవ్యసుమతిచేఁ
దను బోఁటి లోభివాఁ డితఁ
డన నిడుపులమీఁదిబిందు లరబిందు లగున్. 57

క. *కుఱుచలపై యరబిందులు
నెఱయఁగ నూఁదినను జెల్లు నిడుపులమీఁదన్
నెఱయవు గద్యంబులలో
నెఱబిందువు లూఁదుబద్యనికరములోనన్. 58

క. నన్నను నిన్ననుఁ దన్నను
న న్నందుల కనుల కినులయందును మును పై
నున్న నకారపుఁ బొల్లులు
పన్నగఁ [1]బోఁ జూపు నచ్చుపై నున్నయెడన్.

* ఇందలిపాఠభేదాదులు పీఠికలో జూపఁబడినవి.

1 బోడసూపుసున్న; బోడసూపు నొకఁడు.

క. న న్నెఱుఁగు నన్ను నెఱుఁగున్
దన్నెఱుఁగుచుఁ దన్ను నెఱుంగుచ త్తజ్ఞుఁడిలన్
ని న్నెఱుఁగు నిను నెఱుంగును
నన్నం బరువడిగ నివి యుదాహరణంబుల్. 60

క. తన కెనయె తనకు నెనయే
ముని కెనయే మునికి నెనయె మూర్ఖుం డనఁగాఁ
గునులకుఁ గినులకు జగతిన్
దనరంగా వరుసతో నుదాహరణంబుల్. 61

క. [1]ప్రాసఁగం బల్కెడునెడ బొ
ల్పెసగిన ప్రథమాంతములవయిం గదిసి కడున్
బస నారుకచటతపల ను
గసడదవల్ ద్రోచి వచ్చుఁ గవిజనమిత్రా! 62

తే. సుతుఁడు గడువేగమున వచ్చెసుతుఁడు సనియె
సుతుఁడు చక్కరితోఁడఁ దాఁ జుట్ట మయ్యె
సుతుఁడు చంద్రికిఁ బ్రణమిల్లె సుతుఁడు వృద్ధె
ననఁగ నివి యుదాహరణంబు లయ్యెఁగృతుల.

క. తెలుఁగులలో నచ్చంబులు [ని
[2]డులు రులు నులు వచముతుది నడమఁ గలిగిన

---

1 ముద్దరాజు రామున రాఘవపాండవీయవ్యాఖ్య
2 డులు రును వెరపదము.

ష్టుల దానిమీఁది యుత్వము
పొలుపుగ హ ల్లుండెనేనిఁ బోవు న్నిలుచున్.

ఆ. మూరుమండఁ జొచ్చె మూర్కొండె వ్రే ల్మెట్టె
వ్రేలు మట్టె వేడ్క వేడు కయ్యె
కాలుకాల మనఁగఁ గార్కాల మనఁ గాన్పు
కాను పనఁగ నెల్లకడలఁ జెల్లు. 65

ఆ. ఏకపదము నడిమియుత్వ మొక్కొకతఱి
నచ్చు తెనుఁగులోన నడఁగుఁ బొడముఁ
గూర్మి తాల్మి యనఁగఁ గూరిమి తాలిమి
యనఁగఁ గృతులఁ జెల్లు చునికిఁ జేసి. 66

క. అ ఱ్ఱె ఱ్ఱంతంబులపై
యుఱ్ఱగు నన్నయును దల్లియును ననుక్రియ నా
యుఱ్ఱంత మొందుచోటుల
నుఱ్ఱగు మనుమఁడును నందనుండును ననఁగన్.

వ. అనంతరంబ విభక్తులు చెప్పెదఁ బ్రథమయుఁ
ద్వితీయయుఁ దృతీయయుఁ జతుర్థియుఁ బంచ
మియు షష్ఠియు సప్తమియు సంబోధనంబు
నన నెనిమిదితెఱంగుల విభజింపఁబడుటం జేసి
విభక్తు లనంబరఁగె. చేయువాఁడు ప్రథమయుఁ,

జేయంబడినది ద్వితీయయు, నుపకరణంబు తృతీయయుఁ, జేయించుకొనువాఁడు చతుర్థియుఁ, బాయుటకు న్బట్టయినది పంచమియు, నొడయండు షష్ఠియు, నునికిపట్టు సప్తమియు, సమ్ముఖంబు వేఁయునది సంబోధనంబును నగు. వానికి నేకవచనబహువచనభేదంబులఁ బ్రత్యేకంబు రెండువిధంబులఁ జెందు నందుఁ బ్రథమ యెట్లనిన. 68

క. పలు కనుట యేకవచనము
పలుకుపయి న్లలను నిలుప బహువచనంబుల్
నెల నెల లనఁ దల తల లనఁ
జిలుక చిలుక లనఁగ జగతిఁ జెల్లుటవలనన్. 69

క. డుల నెల్లయెడల ద్రోచును
వెలుఁగువిభక్తుల క్రమంబుఁ దెలిపెద ననఘుల్
బలవంతులు ధనవంతులు
కులజులు నయవిదులు భావుకులు ననఁ జనుటన్.

క. లులమీఁద లులకు దళ్లగు
నిలఁ జెక్కుటబాలు రన మహీపాలు రనన్
లలితపయోళు రసంగా
నలవడ వర్తిల్లుఁ గాన నభినవదండీ. 71

క. పోఁడిగ బహువచనంబులు
వీఁ డనుచో వీండ్రు వీరు వీరలు నయ్యెన్
తాఁ డనఁ గాం డ్రనఁ గా అన
వాఁడునకున్ వాండ్రు వారు వారలు నయ్యెన్.

ఆ. కొఱను నెఱను నాఁగఁ గొలను నా మ్రానఁ
గలను గవను కెలను వలను నాఁగఁ
బరఁగుశబ్దములకు బహువచనంబుల
నులకుఁ గులు విధించె నూత్నదండి. 73

క. కొఱఁకులు నెఱఁకు లనంగా
మఱియుం గొలఁకులును రేఁగుమ్రాఁకులనంగా
మెఱయున్ గలఁకులు గవఁకులు
నెఱకెలఁకులు వలఁకు లనఁగ నెగడెడికతనన్.

ఆ. ఇల్లు కల్లు ముల్లు పల్లు వి ల్లన నివి
బహువచనము లగుచుఁ బరఁగు నెడల
నిండ్లు కండ్లు ముండ్లు పండ్లు విం డ్లనఁ జను
సుతగుణాభిరామ నూత్నదండి. 75

తే. పేను చేను మీ ననునివి పెక్కులైనఁ
బేలు చేలు మీలు ననఁగఁ బోలు జగతి
యిలకుఁ దులువాండు నొకకొన్ని యిలనడంచి
లులబహుత్వమునం దుది మెలఁగుచుండు. 76

తే. చేయి వాయి నేయి యనుచుఁ జెప్పుచోటఁ
బ్రీతిఁ జేతులు వాతులు నేతు లయ్యె
రాయి రేయి వేయి యనుచో రాలు రేలు
వేలు నా నొప్పు బహువచో వేళయందు. 77

క. డలుఱుడు లంత్యము లైనన్
బలి నడఁచి తదంత్యములకు ళ్ళగు బహుత్వం
బలుగోళ్లని కొనవేళ్లని
కలసాళ్లన్ ఱేళ్లు నాఁగఁ గ్రమమై యునికిన్.

క. పదము తుది యిత్వ ముత్వము
పదిలంబుగ బహువచనము పై నొందినచో
నది దెలియుఁడు మణులు ఘృణులు
సుదతులు సన్మతులు సఖులు సుకవు లనంగన్.

తే. పసఁగుఁ బెక్కుట నొకటె తెమ్మెరలు నీళ్లు
వఱలు కొలుచు లవెల్లెల్ల బహువచనము
గోదుమలు వడ్లు జొన్నలు కొఱ్ఱ లాళ్లు
చోళ్లు ననుములు పెస లనఁ జెల్లుఁ గాన. 80

క. చెలియ లన నా లన మఱం
దలు కోడలు నాఁగ జనుపదంబులతుదలన్
లులకుం డ్రులగుం బెక్కుటఁ
జెలియం డ్రన నాం డ్రనంగఁ జెల్లుటవలనన్.

క. జంగమపదములుఁ దక్క ధ
రం గలపదములద్వితీయ ప్రథమయు నగు రా
జంగదము లూఁద్చెఁ బతినూ
త్నాంగదములఁదాల్చెననఁగ ననువై యునికిన్.

తే. వలసినప్పుడు చేత కై వలన యొక్క
యందు నునివి యగుఁ దృతీయాదులందు
స్త్రీపురుషశబ్దములయందు జేత వలన
నందు నునివి యగుఁ దృతీయాదులందు. 83

తే. డులకు నిను నేకవచనము తెలుఁగులందు
నిలుచుఁ దత్సమపదముల నిలుచుఁ బోవు
లలు ద్వితీయాదు లగువిభక్తులకు నెల్ల
బహువచనములై చను నెల్లపదములందు. 84

క. కమియంగ నికి నకులు త
త్సమములఁ బోఁద్రోచి నిలుచు షష్ఠి చతుర్థిక్రమమునఁ గుఱ్ఱగు నఱ్ఱం
తమునకు నుఱ్ఱంతమునకుఁ దగు నఱ్ఱు లలిన్.

క. గురునికి గురునకు ననఁగాఁ
బరఁగఁగ బాలునికి ననఁగ బాలున కనఁగా
గరగకు గొరవకు ననఁగాఁ
దరమున కురమునకు నా నుదాహరణంబుల్.

క. ఇ ను డు రు లు ల్వంతములకు
కినులగు వారిధికి చేనికిని నాడికి నో
లిని యూరికి వ్రేలికి నన [నన్.
కును లగు బహువచనములకుఁ గొడుకులకు న

వ. తత్సమపదాంతంబు లగుస ప్తవిభ క్తులందు నేక
వచన బహువచనము లెట్టివనిన. 88

క. సుతుఁడు సుతు సుతుని గనియెన్
సుతుచేతన్ సుతునిచేత సుతునకు నిచ్చెన్
సుతునికిని సుతునివలనన్
సుతువలనన్ సుతునిధనము సుతుధన మెలమిన్.

క. సుతునందు సుతునియందున్
సుతులు సుతుల సుతులచేత సుతులకు నిచ్చెన్
సుతులవలన సుతులధనము
సుతులం దన నేక బహువచోనియతి యగున్.

వ. ముల్వంతములకు 91

క. వృక్షము మొలచెను నఱకెను
వృక్షము వృక్షమున బ్రతికె వృక్షమునకు నీ
వృక్షమునఁ బండు వడియెను
వృక్షముతుది వృక్షమున దవిలెనాచూడ్కుల్.

క. వృక్షంబులు వృక్షంబుల
వృక్షంబులచేత బ్రతికె వృక్షంబులకున్
వృక్షములవలనఁ బండును
వృక్షంబులతుదలఁ గలవు వృక్షములందున్. 93

వ. లాంతములకు. 94

క. తలయొప్పెన్ దల దిగిచెన్
దల దాల్చెన్ దలకుఁ జీడ తలవిరి వోలఁగెన్
తలవెండ్రుక తలసొమ్ములు
తలలం దన నిట్లు బహువిధంబులఁ జెల్లున్. 95

క. తల లొప్పెఁ దలలు దునిమెను
తలలన్ ధరియించెఁ జీరతలలకునాడెన్
దలఁ జుట్టె పెడతలవడెన్
దలలకు మణిభూషణములు తలలం దనఁగన్. 96

వ. ర్యాంతములకు. 97

క. కరివచ్చెన్ గరినెక్కెను
గరిచేతం జచ్చెఁ గరికిఁ గవణమువెట్టెన్
గరివలననుఁ గరికుంభము
కరియందు మదాంబుధార కడుబెడఁ గయ్యెన్.

తే. డడల రేఫకారముల్ దొడరె నేని
యొక్కెడన రెండుమాత్రల లెక్క కెక్కు

బంట్లు బంటులు నా బండ్లు బండు లనఁగ
గుంట్ర గుంటర నా గుండ్ర గుండ రనఁగ. 99

క. కూఁతురుపదము రుకారము
బ్రాతిగఁ దాఁ జెడు విభక్తి పైఁ బెట్టినచోఁ
గూఁతురు కూఁతుం గనియెను
గూఁతులచేఁ గూఁతువలనఁ గూఁతులధనముల్.

వ. అనంతరంబ సంబోధనంబు లెఱింగించెద. 101

తే. ఏకవచనపుఁదుదలందు నెలసి నిలుచు
సుత్వ మత్వ మా నిత్వంబు నీత్వ మొందు
నార బహువచనంబు పైఁ జేరి నిలుచు
హ్రస్వములు నిడుపు లగుఁ గవ్యనుమతమున.

క. సుతుఁడ సుతుండా యనఁగ సు
దతి సుదతీ యనఁగ విమలతరమతులారా
హితకారులార యనఁగా
నతిశయముగ వరుసతో నుదాహరణంబుల్. 103

క. అమర డు సంబోధనత
త్వములఁ బొడచూపు నొక్కతఱి నోపురుషో
త్తమ యోపురుషోత్తముఁడా!
విమలయశా విమలయశుఁడ వినుమని చనుటన్.

వ. యుష్మదస్మత్పదంబు లెఱింగించెద. 105

ఆ. ఎలమి నీవు మీరు నే నేము ప్రథమలు
నిన్ను మిమ్మనంగ నన్ను మమ్ము
నన ద్వితీయ లయ్యె నని యుష్మదస్మత్ప
దములు దెలియ నూత్నదండి సెప్పె. 106

క. నీమీలకు నామాలకు
ధీమహితా వరుసతోఁ దృతీయాదులయం
దేమఱక చేతనాది
స్తోమం బిడ నేకబహువచోనియతి యగున్. 107

క. దేవా నీచే నీకుఁ
నీవలనఁ నీధనంబు నీయం దనఁగా
దేవా మీచే మీకుఁ
మీవలనఁ మీధనంబు మీయం దనఁగన్.

క. దేవా నాచే నాకుఁ
నావలనఁ నాధనంబు నాయం దనఁగా
దేవా మాచే మాకుఁ
మావలనఁ మాధనంబు మాయం దనఁగన్.

వ. అనంతరంబ సమాసంబు లెఱింగించెద మొద
లిపదంబు విభక్తులఁ బుచ్చి మీఁదిపదంబుల
తోడ సమ్యక్సంసక్తంబు లగుటం జేసి సమా
సంబు లయ్యె నవి పూర్వపదార్థప్రధానంబును

నుత్తరపదార్థప్రధానంబును నన్యపదార్థప్రధానంబును నుభయపదార్థప్రధానంబును ననం జతుర్విధంబులై వ_ర్తిలుఁ నందుఁ బూర్వపదార్థ ప్రధానం బెట్టి దనిన. 110

క. పెడతలయును క్రేఁగన్నులు
నడురే యెడకాలు మనుజనాథుఁడు రిపుఁ దా
నెడగాలఁ బెట్టె ననఁ బోలు
పడర నుదాహరణము లగు నభినవపండీ. 111

వ. ఉత్తరపదార్థప్రధానం బెట్టి దనిన. 112

క. చలిగాడ్పు నల్లగలువలు
వలవంతలు తెల్లదమ్మి వలిక్రొవ్విరియు
త్తెలమావిమోక కెంజిగు
రలరమ్ములు నాఁగ నివి యుదాహరణంబుల్.

క. అని యగు గుణిపిఁటుఁడ గుణం
బనువుగ బోధించుచోట నది గాదే న
ట్లు నకార ముండు నల్లని
కనుఁగవ యన నల్లగన్నుఁగవ యనఁ జనుటన్.

వ. అన్యపదార్థప్రధానం బెట్టి దనిన. 115

తే. చలివెలుఁగు వేఁడివెలుఁ గనఁ బులుఁగుపడగ
నలువ యన ముచ్చెకంటి నా నలరువిల్తుఁ

డనఁగ వాలివాఁడియు జేతలాడి యనఁగఁ
దనరు నన్యపదార్థప్రధానచయము. 116

వ. ఉభయపదార్థప్రధానం బెట్టి దనిన. 117

ఆ. తల్లిదండ్రు లన్నదమ్ములు గూఁదూ్యర
తెలమి నాలుబిడ్డ లెద్దుబండ్లు
బంటుతేఁడు లాటపాటలు నుభయప్ర
ధానమునకు నివి యుదాహరణములు. 118

క. ధీనిధి గుణపదములపై
మానుగ హల్లున్న నంతిమము లగు ములకుఁ
బూని పునాదేశం బగు
భూనుత పైనచ్చు లున్నఁబుట లగు ములకున్

క. వాదపుఁబంతంబులును బ్ర
మోదపుశృంగారములును ముత్యపుసరులుఁ
జూదపుటాటలు నెయ్యపు
టాదరములు నసఁగ నివి యుదాహరణంబుల్.

ఆ. ఇల్లు కల్లు ముల్లు పల్లును విల్లును
కన్ను మున్ను వెన్ను చన్ను నాఁగఁ
బరఁగు శబ్దములకుఁ బైహలాదులతోడ
నదుకు నవుడు జడ్డ లకఁడుఁ జెల్లు. 121

క. విలుకాఁ డిలువడి గలుపని
ములుపోఁడ పలుపరున లెస్స ముసుగా ల్చనుము
క్కులు గనుగొనలు వెనుస్రా
పలవడు నని చెప్ప నివి యుదాహరణంబుల్.

తే. ఓలి రెండును మూఁడును నాలు గనఁగఁ
బరఁగుపదములఁ బట్టిన నియ ము నలులు
పొరయు ములమీఁద జడ్డలౌ నియవదియును
ముప్పదియు నలువదియు నా నొప్పుఁ గాఁగ.

క. తెనుఁగులఁ గొన్నిఁటిలో నును
కొని జడ్డలతోడ నిలిచి క్రొన్నెలు కృతికిన్
బనివడి క్రొత్తయు నెఱయును
ననుటఁ దెలియఁ జెప్పు వరుస నవి యెట్లనినన్.

క. క్రొన్నెల క్రొమ్మెఱుఁగులు నాఁ
గ్రొన్నన క్రొక్కారు నాఁగఁ గ్రొత్తమ్ములు నా
నెన్నడుము నెమ్మొగము నా
నెన్నడ నెత్తావి యనఁగ నెన్నుదు రనఁగన్.

క. తెలుఁగున కెంచెమ్ములు ముసు
గలవాక్యము లరుణకాంతి గావించును గెం
దలిరులు కెందమ్ములు నాఁ
జెలువుగఁ జెంగల్వ లనఁగఁ జెందొవలనఁగన్.

క. పేరనియెడుశబ్దం బే
పారం దెనుఁగులకు మొదల నధికత దెలుపుం
బేరాఁకలి పేరాముని
పేరాముదపాకు లనఁగఁ బేరింపనఁగన్. 127

క. తన నా నీ యనుపలుకుల
నెనయంగ హలాదు లదుకునెడ దుత్తు నగుం
తనదుధనము నాదుగుణం
బన నీదుయశంబు నాఁగ ననువై యునికిన్.

క. నెరిఁ గులజులపై సరి దా
నెరయఁగ బహువచనషష్ఠి నిలుపఁగ నగుఁ గ
మ్మరిగడి మేదరిగడి కం
చరిగడి మూసరితెఱంగుసను ననఁ జనుటన్.

తే. పెక్కుసంస్కృతశబ్దంబు లొక్కపదము
క్రిందఁ దద్విశేషణము లిం పొందఁ గూర్చి
తెలుఁగు తత్సమాసముక్రిందఁ గలుపునప్పు
డగ్రపదముతో నిల నగు నర్థఘటన. 130

తే. తనవిశిష్టకులాచారధర్మ మనఁగఁ
దనజగద్గీతసాధువర్తన మనంగఁ
దనదిగంతరవర్తిప్రతాప మనఁగ
నివి యుదాహరణంబు లై యెందుఁ జెల్లు. 131

క. దినకరకొడుకునకును సరి
యనిమిషమొదవునకు సాటి యని యిబ్బంగిన్
దెనిఁగింప సంస్కృతములం
దెనుఁగులు సంధించిరేనిఁ దెగడుదు రార్యుల్.

క. తెనుగుపదంబులపైఁ బెం
పొనరఁగ సంస్కృతముచెల్లు నొక్కొకచోటన్
మును సుకవీంద్రులు కృతులన్
బనిగొని రచియించినట్టిపరిపాటి మెయిన్. 133

క. వాఁడిమయూఖము లనఁగా
వేఁడిపయోధార లనఁగా వింజామర నా
మూఁడస్త్రంబు లనంగాఁ
బోఁడిమిఁ గలకంఠనామము న్బోలి తగున్. 134

క. నీ సంస్కృతంబుతోడ స
మాసించును నీవినూత్నమణినూపురశ
బ్దాసక్తచిత్తహంస
త్రాసకరాంబుదము నాఁగఁ దలుపై యునికిన్.

క. మొదమున నా యీ యేలను
పదములతుద నూష్మ లుడుగఁ బైవర్ణముతో
నదుకునెడఁ గుదియు సాగును
గుదియునెడన్ జడ్డప్రా లగున్ బైహల్లుల్.

క. ఆకామిని యక్కామిని
యీకొడుకిక్కొడుకు నాఁగ నీయూరియ్యూ
రేకార్యం బెక్కార్యం
బాకథ యక్కథ యనఁగ నుదాహరణంబుల్.

వ. అనంతరంబ క్రియాపదంబు లెఱింగించెద. 138

క. ఇల నొరుఁడు నీవు నేనును
నలిఁ జేసినపనులు క్రియలు నానావచనం
బులు కాలత్రితయంబున
నలవడి యాక్రియలు చెల్లు నభినవదండీ. 139

క. ఎన్నఁగ భూతార్థము నెడ
నెన్నగు వర్తించునర్థ మెఱుఁగఁ బలుకుచో
నున్నగు భవిష్యదర్థము
నున్నంగాఁ బలుకుచోట నూతనదండీ. 140

క. ఒరులకు నెను నిరి యగుచు నె
దిరికిఁ దివితికారములును దిరి యగుఁ దనకుఁ
బరువడిఁ దినియుఁ దిమియుఁ
బొరయు నుభయవచనములకు భూతక్రియలన్.

క. పలికెను బలికి రనంగాఁ
బలికితివి పలికితి మఱియుఁ బలికితి రనఁగాఁ

బలికితిని బలికితి మనఁగ
నలఘుమతీ వరుసతో నుదాహరణంబుల్. 142

క. డును దరు లారులకు నెదిరికిఁ
దనరంగా దు దవు దరులు తనకు దను దముఞ్
జను నేకబహువచనములు
మనుసన్నిభ క్రియల వర్తమానార్థములన్. 143

క. అడిగెడు నడిగెద రనఁగా
నడిగె దడిగెదవు ధనంబు నడిగెద రనఁగా
నడిగెద నడిగెద మనఁ బొ
ల్పడరంగా వరుసతో నుదాహరణంబుల్. 144

క. ఉను దురు లారులకుఁ జెప్పను [ముల్
దనరఁగ దువు దురు లెదిరికిఁ దనకు దును దు
దనరఁగ నివి యేకబహువ
చనము లగు భవిష్యదర్థసంసూచకముల్. 145

క. పలుకును బలుకుదు రనఁగాఁ
బలుకుదువు పలుకుదు రనఁగఁ బలుకుదు నర్థిఞ్
బలుకుదు మనఁగా నిన్నియు
నలఘుమతీ వరుసతో నుదాహరణంబుల్. 146

క. స్థావరతిర్యక్ప్రీతతుల
కేవెరవునఁ గ్రియలు పొందు నేకవచనముఞ్

దేవమనుష్యాదిక్రియ
భావింపఁగ నేకవచన బహువచనంబుల్. 147

క. శిల గదలె శిలలు గదలెను
బులి గఱచెం బులులు గఱచె బోటి చనియె బో
టులు చనిరి ముని యలరె మును
లలరిరి నా వరుసతో నుదాహరణంబుల్. 148

క. [1]ఉటపరపదములె క్రియ లగు
చుటలొక్కెడ యుటలు పుటలు చుట్టంబులఁద్రో
పుట ద్రోయుట యన చుటలుఁ
బుటలును నగు సంస్కృతంబు పొందినచోటన్.

క. పుటచేతనైన నొరుఁ బం
పుట చుటచే నైన నొరులఁ బుత్తెంచుట చే
యుట యుటచే నగు నని యా
పటుమతి యగునూత్నదండి ప్రకటముచేసెన్.

క. పలుకుట పలికించుటయును
నలుగుట యలిగించుటయును నబలలు మదిలో

1 క. 'పుటచుటపదములు క్రియలగు
చుటలును యుటతలును బెద్దచుట్టంబులు త్రో
చుట త్రోపు కోఁతకోనుటయు
తలపుటయు సుటలును సంస్కృతము లొందినచోన్.'
అని పాఠాంతరము.

వలచుట వలపించుటయును
తలఁచుట తలపించుటయు నుదాహరణంబుల్.

క. అసమస్త లఘుద్వ్యక్షర
లసితము లగు తత్సమంబులం జెప్పెడిచో
పొసఁగు నియించుటయుఁ గ్రియ [లన్.
లసదృశ యించుటయె క్రియల నగు వెఱయెడ

క. వరియించుటయు వరించుట
తిరముగ నుతియించుటయు నుతించుట బలిమిఁ
బరు భంజించుటయును సం
హరించుటయు వరుసతో నుదాహరణంబుల్.

తే. ప్రార్థనార్థంబుచోటను బ్రశ్నచోట
సంశయం బుండుచోట నిశ్చయముచోటఁ
దెగడుచోటను నేత్వంబు తెనుఁగునందు
నోయి లొందును సంశయం బొందుచోట

క. పోవే వానలు గలవే
నీవే ననుఁ బిలిచి తిపుడు నియతుం డతఁడే
నీవు పొలియవే యమృతమొ
త్రావును విషమోయనఁగ నుదాహరణంబుల్.

క. ఎంచఁగ నేఁగుపదముతుదఁ
దెంచుట యగుఁ గ్రియల నరుగుదెంచుటపై కే

తెంచుట చను దెంచుట నడ
తెంచుట తో తెంచు టనఁగఁ దెల్లం బగుచున్.

క. ఒకకర్త చేయుపనులకుఁ
ప్రకటితముగ మొదలనయినపని యిత్యాంతం
బకృతం బైనను కాంతం
బకుటిల కర్తవ్యకార్య మన్వంత మగున్. 157

అ. ఆడఁబోయి చూచి యలిగెఁ బెట్టక త్రోచె
వినక పలికె నియ్యకొనక చనియె
కుడువ నేఁగె వేఁడుకొన నాసతో వచ్చె
నన నుదాహరణము లయ్యెఁ గృతుల. 158

క. తినుటకును తింట యగు మఱి [గుఁ
కొనుటకుఁ గొంట యగుఁ గనుటకుం గంట య
వినుటకు వింట యగుఁ దా
ననుటకు నంట యగు వలసినప్పుడు కృతులన్.

క. ఉటలకును వక లగు తెనుఁగు
చుటలకు వక లగును గదియుచో మును దాఁజే
యుటకుఁ జేయక మును ద్రో
చుటకుఁ ద్రోవక మునును బ్రచుర మైయునికిన్.

క. దీవెన కెడమయుఁ గాతయుఁ
గావుతయుఁ దెనుఁగుకవులకబ్బంబులలో

శ్రీవెలిఁగెడ మధిపుఁడు మేల్
గావించుంగాత మేలుగావుత యనఁగన్. 161

తే. ఏకపదముపైఁ గాఁడు నేర్పెల్లఁ దెలుపు
గొనబుకాఁడు బలిమికాఁడు కొండెకాఁడు
చనవుకాఁడు చెలిమికాఁడు జాడగాఁడు
బందికాఁ డన నెల్లెడఁ బరఁగుచుండు. 162

ఆ. ఈఁడు బాస దెల్పు నీఁడు గుణము దెల్పు
నీఁడు కులము దెల్పు నెల్లయెడలఁ
గన్నడీఁడు నాఁగఁ గపటీఁడు నాఁగ సా
లీఁడు నాఁగ వేరులేక చనుట. 163

క. ఇండి యనుట లే దనుటయొ
యొండొకయర్థంబు గలుగ నోపదు ధర ము
క్కిండియు వెరవిండియు ద్రా
యిండియు ముప్పిండి యనఁగ నేర్పడియునికిన్.

తే. ఆఁడు నరియును నధమకార్యములఁ దెలుపు
బొంకులాఁడు తగవులాఁడు ఉంకులాఁడు
వెంటివెనపరి ముండరి తుంటరియును
గల్లరియు నన నెల్లెడఁ జెల్లుఁ గాన. 165

క. అమి లేమికి నిమి కల్మికి
నమరంగాఁ దనము ధర్మ మగుటకుఁ దగుఁ గా

నమి వినమి తాల్మి కూరిమి
తమమంచితనంబు లోభితన మనఁ జనుటన్.

క. ఆఁడును నీఁడును గత్తెయుఁ
గాఁ డనుచోఁ గర్త యగు జగం బెఱుఁగంగా
బోఁడి యనఁగ నెల్లెడలను
నాఁడుం బేళ్లకును జెల్లు నభినవదండీ. 167

క. ఆలికి రా లగు దిగువ గు
ణాలి నిలిపి పలుకుచోట నను వగునెడ గో
త్రాలు జవరాలు పాతకు
రాలు గెడపురాలు ముద్దరా లనఁ జనుటన్.

ఆ. అచ్చుతెలుఁగుమాట నను వైనచో వకా
రము గకారరూపు మమరఁ దోఁచుఁ
దీవె తీగె యనఁగ జేవ చేగ యనఁగఁ
బవలు పగలు నాఁగఁ బరఁగుఁ గాన. 169

తే. ఆతఁ డిట్టివాఁ డెట్టివాఁ డట్టివాఁడు
నాఁగఁ జనునట్టి త్రితయమునకుఁ గ్రమమున
నాతఁ డిట్టిఁడు నెట్టిఁడు నట్టిఁ డనఁగఁ
దగుల నిమ్మెయి నభినవదండి చేసె. 170

తే. అన్యుఁ బిలుచుచో నిడుద లౌ నక్షరములు
కుఱుచ లై జడ్డముల మోచుఁ గొన్నియెడలఁ

కొడుక రా మఱి కొడుక షా కొడుక రమ్ము
కొడుక పొమ్మన జగతిలోఁ గూడుఁ గాన. 171

తే. అన్యుఁ బనుపుచో నుఱ్ఱంత మైనశబ్ద
మచ్చు పైనున్న ముఱ్ఱంత మగుట నిజము
మొనసి పొడు వరిసేనల ననఁగఁ జనదు
పొడువు మరిసేన ననుటయె పోలుఁ గాని. 172

తే. చనులపై నకారము పొడచూపుఁ బోవు
నొప్ప నచ్చులు పై డాసి యుండెనేని
యొదవుచున్నచో నొదవుచునున్నచోట
పొడుచుచపరెను బొడుచుచునడరె ననఁగ.

ఆ. అందు నిందు నెందు నను నర్థములు మఱి
యటయు నిటయు నెటయు నగుఁ గ్రమమునఁ
గ్రియలు రాక పోక లయి మీఁదనుండిన
నుతగుణాభిరామ నూత్నదండి. 174

క. అటపోయెడి నిటవచ్చెడి
నెటకరిగెడి ననుట యుచిత మిటుపలెఁ గాదే
నటయాడెడి నిటపాడెడి
నెటగూర్చున్నాఁ డనంగ నెసఁగవు కృతులన్.

క. సల్లలితైకపదముపై
నిల్లు నిలుసు క్రియలఁ గొన్నియెడలను దగ సం
ధిల్లుట శోభిలుటయుఁ బ్రభ
విల్లుట యన జగతిలోన బెడఁగై యుండున్.

క. మల్లెయు లంజెయు గద్దెయు
నొల్లెయు ననుపగిదిపలుకు లొప్పవుఁ గృతులన్
మల్లియ లంజియ గద్దియ
యొల్లియ యని పలికి రేని యొప్పున్ గృతులన్

క. అవ డవలపై వకారము
కవియనుమతిఁ బోవు అడలు కడునిడుపు లగున్
శివు మఱవండు మఱాఁడు గ
డవఁబలికెను వాఁడు శివు గడాఁ బలికె ననన్.

క. దూయుట దాఁగుట దొంగయు
దాయుట యని చెప్పిరేని దనరును గృతులన్
డూయుట డాగుట డొంగయు
డాయుట యని చెప్పినను బెడంగగుఁగృతులన్.

క. ఇన భూతార్థముఁ దెలుపును
గనుఁగొనఁగాఁ గర్తృకరణకర్మంబులఁ బం

---

1 సర్వలక్షణసారసంగ్రహము - తిమ్మకవి

డినవాఁ డనఁ బోఁడిచినవా
లనఁ బండినకొలుచు నాఁగ ననువై యునికిన్,

క. ఇనపై నుండునకారం
బును పై వాఁ డనుపదంబు మొదలివకారం
బును జడ్డనకారం బగుఁ
గనినాఁ డభిమతములోలిఁ గన్నాఁ డనఁగన్.

క. వినెఁ గనెఁ గొనె ననుపగిదిన్
జనుపలుకుల నుండు నడఁగు సంబంధంబుల్
వినియెఁ గనియెఁ గొనియె ననఁగ
ననువై వర్తిల్లుఁ గాన నభినవదండీ. 182

క. మానుగ నక్షక్షాంతము
లైనపదము లూఁదఁబలుక నగు నెక్షుక్షాం
తానేకశబ్దజాలము
దా నక్షాంత మగు నూఁది తగఁ బల్కునెడన్.

క. దాతయొ కల్పమహీజము
నీతియొ బ్రతుకునకుఁ దెరువు నిఖిలకళాని
ష్ణాతుఁడ మహాత్ముఁ డన ని
ట్లాతతముగఁ జెల్లుఁ గాన నభినవదండీ. 184

క. ఉత్తమగుణసూచక మగు
నెత్తమ్మియు నెమ్మొగంబు నెత్తావియు నా
నిత్తెఱఁగున రసికులు దమ
చిత్తము రుచియించుచోటఁ జెప్పుదు రొప్పన్.

క. పెక్కిటి కొకక్రియ యుడుచో [యొ
నొక్కటఁ దుదినొండె మొదలనొండెను మఱి
క్కొక్కటి కొండెను బెట్టుదు
రక్కట క్రియ నడుమఁ బెట్టు రాంధ్రకవీంద్రుల్.

క. కరి యరిగెఁ దురగ మరిగెను
గరియున్ దురగంబు నరిగెఁ గ్రక్కున నరిగెన్
గరియును దురగము ననఁ దగుఁ
గరియరిగెన్ దురగ మనినఁ గైకొన రార్యుల్.

క. తీవెల ప్రాఁకులపేరులు
పూవులకున్ బేళ్లు మొగలిపువ్వులు దక్కన్
గ్రోవుల మల్లెలు జాజులు
దా విరివాదు లని చెప్పఁ దగుఁ బెక్కులుగన్.

క. మానయు జేనయు లోనగు
నానాపరిమాణములు జనము గొలుచునెడన్

మానెఁడు జేనెఁడు నను క్రియ
మాన కెఁడులనొందుమీఁద మ్రానయకేతా.

క. తెలు [illegible] క్షణము భువి
[illegible] దండి చెప్పె నభిధానములో
[illegible] లన్ని [illegible]
దెలియుఁడు సత్కవులు మేలు దేటపడంగన్.

క. తప్పులు దీప్పుడు కవులం
దొప్పులు గైకొనుడు దీనికోపనివారల్
తప్పొప్పని వెడబుద్ధులు
విప్పకు డీయన్నలార వేఁడెద మిమ్మున్

ఆ. పాలునీరు వేఱు పఱచునా కలహంస
రీతి మ్రాన యార్యకేతనకవి
ఆంధ్రలక్షణంబు నలరంగనాచంద్ర
తారకంబుఁగాఁగఁ దా రచించె.

గద్యము. ఇది శ్రీమదభినవదండివిరచితంబైన యాంధ్రభాషాభూషణంబునందు సర్వంబును నేకాశ్వాసము.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1949

